Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



త్రిభువనమల్లదేవబిరుదాంకితుఁడు. ఇతనిసామంతుఁడగు ఏఱువ తొండ్డయ, సమధిగతపంచమహాశబ్దమహామణ్డలేశ్వర, వీరమాహేశ్వర కోడూరు పురవరేశ్వర సూర్యవంశోద్భవకులతిలక కాస్యపకరికాలాన్వయనామాది సమస్తప్రాశస్త్యసహిత శ్రీమన్మహామండలేశ్వర బిరుదాంచితుఁడు. మైలమదేవి శాసనము శక 1043 వ సంవత్సరమున (శ్రీమచ్చాలుక్య విక్రమసంవత్సరంబులు 46) చైత్రబహుళ అమావాస్య బుధవారము నాఁడు ద్రాక్షారామ భీమేశ్వరునికిఁ బెట్టిన అఖండదీపము కొఱకీయఁ బడినది.

ఏఱువ తొణ్డయ మహామణ్డలేశ్వరుఁడసి యుండుటచే శ్రీమ. త్రిభువన మల్లదేవరకు ముఖ్యసేనానాయకులలో నొకఁడుగాఁ గన్పించుచున్నాఁడు. వేంగీసామ్రాజ్యమును వశపఱుచుకొనదృఢసంకల్పముతో నున్న విక్రమాదిత్యునకు ఏఱువ తొణ్డయయొక్కయు, ఏఱువ భీముని యొక్కయు సహాయ మవసరమైయుండియుండును. మైలమదేవి శాసనము ననుసరించి శకవర్షంబులు 1043 లో ఏఱువ తొణ్డయ ద్రాక్షారామలో నున్నట్లు స్పష్టపడుచున్నది. ఆసమయముననే కోడూరులో చాళుక్యతైలపదేవుఁ డున్నట్లు శాసనాధార ముండుటచేతను* ఏఱువ తొణ్డయ కుమారుఁడుగా నిరూపింపఁబడిన ఏఱువ భీముని పరాక్రమ ముద్ఘాటింపఁబడిన చాటుపద్యములో ఏఱువ భీముఁడు

ఉ. పన్ని తురంగమంబునకుఁ బక్కెర వెట్టినవార్త చారుచే
 విన్న భయంబునం గలఁగి వేసట నాఁటనె చక్రగోట్టముల్
 మన్నియ పట్టణంబులును మక్కిన వేంగి కళింగలాదిగా
 నిన్నియు నొక్క పెట్టగసె నేఱువ భీమనృపాలుధాటికిన్.

అని యుండుటచేతను, ఏఱువ తొణ్డయ నాఱవ విక్రమాదిత్యునికి వేంగిరాజ్యమును జయించుటకు ఏఱువ భీమునితోకూడ పోయి శక

* Telingana Inscriptions.
 చాళుక్యశాసనములు 33

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



1043 నాఁటికి ద్రాక్షారామమువఱకు పోయెనని యూహింపవలనుపడు చున్నది.

వేఱొక విషయమువలనఁగూడ ఏఱువతొండ్డయ తన ప్రభుసేవలో నిమగ్నుఁడై, విక్రమాదిత్యునిపై నెదురుతిరిగి స్వాతంత్రింపఁ బూనిన సామంతులను శిక్షించుచుఁ దన ప్రాణము పోఁగొట్టుకొనినట్లు మనమూ హింపవచ్చును. వర్ధమానపురాధీశ్వరుఁడైన గోన గన్నయరడ్డిగారి రాజ్యరక్షకులైన విఠ్ఠలనాథభూనాథుఁడు, ఆదవని, తుంబుళము, మానువ మొదలగు దుర్గములు సాధించి శక 1217లో రాయచూరుదుర్గ నిర్మా ణము చేయుసందర్భమున నిచ్చిన శాసనములో గోన గన్నయరడ్డియొక్క బిరుదావళులలో "ఏఱువతొండ్డ గోధూమఘట్టన ఘరట్ట" అనిగలదు. రాయచూరు శాసనము ననుసరించి శక 1217 నాఁటికింకను గోన గన్నయ జీవించియున్నట్లగపడుచున్నది. అం దాతఁడు కాకతీయకటకసన్నాహుఁ డనియు, చోళజగజాళ వీరకాంతికాఱుఁడనియు, కోసగిమైలి తలగొండు గండఁడనియు, ఉప్పలసోముని తలగొండుగండఁడనియు, వందిభూపాలుని తలగొండుగండఁడనియు, అక్కినాయకుని తలగొండుగండఁడనియు, కందూరి కేశినాయనితలగొండుగండఁడనియు, ఆపాకభీమసిర్ధూమధాముండనియు, "ఏఱువతొండగోధూమఘట్టన ఘరట్టుఁడనియు, కోటపెర్మాడిరాయకంఠా భరణచూఱకాఱుండనియు, చోడోదయ పట్టసూత్రతురంగాపహారుం డనియు, రుద్రదేవ దక్షిణభుజదండుఁడనియు, మొదలుగాఁగల యనేక బిరుదావళులతో సభివర్ణింపఁబడెను.

ఈ గోన గన్నారెడ్డి రంగనాథరామాయణమును రచించిన గోన బుద్ధారెడ్డి తండ్రియగునేమో కొంచెము విచారింపవలసి యున్నది. ఉత్తరరామాయణమును ద్విపదగా రచియించిన కాచవిభుఁడును, పిన విఠ్ఠలభూపతియును తమగ్రంథములలోఁదమతాత గోన కోట గన్నక్షితీం

¶ ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక సంపుట VI పుట 6.

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



ద్రుఁడనియు, తండ్రిబుద్ధరాజనియు వ్రాసియున్నారు. రాయచూరుశాసన మందలి విఠ్ఠలనాథుఁడును, ఉత్తరరామాయణగ్రంథకర్తయు నొకఁడే యని యూహించుకొనినచో గోన గన్నయరడ్డియు, గోన కోటగన్నతిక్కీంద్రుఁడును నొకరేయని భావింపవచ్చును.

గోన గన్నారెడ్డి బిరుదావళులలో 'కాకతీయ కటకసన్నాహుఁ' డనియు, 'రుద్రదేవ దక్షిణభుజదండుఁ' డనియు నుండుటచేత నతఁడు కాకతీయుల దండనాథులలో నొకఁడనియు, రుద్రునకో, రుద్రమకో, ప్రతాపరుద్రునకో ముఖ్యసేనానాయకుఁడనియు, తేటపడుచున్నది. రాయచూరుశాసనము క్రీ॥ శ॥ 1295 నాఁటిదగుటచేతను, ఆనాఁటికింకను గన్నయరడ్డి బ్రతికియున్న ట్లాశాసనమువలననే తెలియుచుండుటచేతను, క్రీ॥ శ॥ 1195 లో మరణించిన కాకతి రుద్రునకు 'దక్షిణభుజదండుఁ'డై యుండఁజాలఁడు. కాని నితఁడు రుద్రమదేవికో, ప్రతాపరుద్రునకో దండనాయకుఁడై యుండియుండును.

ఇతని బిరుదావళులలో నొకటియగు 'ఏఱువతోంట గోధూమ ఘట్టన ఘరట్ట' అనుదాని ననుసరించి మన కీతఁడు చోళవంశీయుఁడగు ఏఱువత్రొండ్డయను జయించినట్లు తెలియుచున్నది. కాని యీబిరుదము నీతని పూర్వులదికాని యీతనిది కాదు. ఏలయన క్రీ॥ శ॥ 1121 లో నున్న ఏఱువత్రొండ్డయను 174 సంవత్సరముల వెనుక 1295 లో నున్న గోన గన్నయ్య జయించుట సంభవముకాదు. కాకతిరుద్రుని కాలముననో రెండవప్రోలుని కాలముననో సామంతుఁడుగానుండియుండిన గన్నయ్య తండ్రితాతలలో నొకరు పశ్చిమచాళుక్య చక్రవర్తియధికారమును వేంగిలో స్థాపింపఁబూనిన ఏఱువత్రొండ్డయను జయించియుందురు. లేనిచో, గోనగన్నయ బిరుదావళులలో ఏఱువతోంట గోధూమఘట్టన ఘరట్టయని యుండియుండుట, సంభవింపదు. ఏఱువతోంటని మరణము, ఆఱవ విక్రమాదిత్యుని మరణానంతర మాంధ్రదేశములో జరిగిన సామంతమాండలికుల స్వతంత్రరాజ్యస్థాపనా ప్రయత్నఫలితమై యుండవచ్చు.

---



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



ఇది యీ సీసమాలికయందలి యితివృత్తము. ఇందు వర్ణింపఁబడిన యుద్ధ మెచ్చట నేకాలమున నడిచెనో, ఇందు పేర్కొనఁబడిన స్థలము లెచ్చటివో, పురుషులెవ్వరో, వా రేకారణమునఁ బోట్లాడిరో కనుఁగొన వలసి యున్నది.

## యుద్ధకారణము.

క్రీ. శ ౧౬౫౦ వ సంవత్సరముతో విజయనగర సామ్రాజ్య మంతరించినది. రాయ రాజ్యమును తురకలు పంచుకొనిరి. తూర్పు భాగమును గోల్కొండసుల్తాను స్వాధీనపఱచుకొనెను. పశ్చిమ భాగమును బిజాపుర సుల్తాను గైవసముఁ గావించుకొనెను. ఈ రెండు తురక రాజ్యములకును నడిమియెల్ల దక్షిణమున చదరంగపట్టణమునుండి యుత్తరమున గుంటూరువఱకును వ్యాపించియుండెను. ఇప్పటి గుంటూరు కడప నెల్లూరు చిత్తూరు చెంగల్పట్టు జిల్లాలును, కర్నూలుజిల్లాలోని నంది యాలపట్టణమునకుఁ బూర్వభాగమునందలి తాలూకాలును అనంతపురము జిల్లా పూర్వభాగమును ఉత్తర ఆర్కాడు జిల్లాలోని విశేష భాగమును గోల్కొండ సుల్తానుకుఁ జెల్లుచుండెను. దీనికిఁ బశ్చిమదక్షిణములనున్న రాజ్యమంతయును బిజాపురపు రాజ్యములోనికి నణఁకువ యైయుండెను. ఇట్లీ తురక రాజులు రాయరాజ్యమును బంచుకొన్నను పొందుకుదరక నొండొరులతో వారు సర్వదా పోట్లాడుచుండిరి. తత్కారణమున కర్ణాటకమున బిజాపుర గోల్కొండ పాదుశాహుల ప్రతినిధులెల్లప్పుడును గయ్యమునకుఁ గాలుద్రవ్వుచుండిరి. ఈసీసమాలిక యందు వర్ణింపఁబడిన యుద్ధము పై కారణమువల్లఁ బొడమినదే

ఇందు పేర్కొనఁబడిన నబాబు ఖాన్ ఖానులు గోల్కొండ బిజాపుర పాచ్చావుల ప్రతినిధులు. నవాబని చెప్పఁబడినాతఁడు సుప్రసిద్ధుఁడైన మీర్ జుమ్లా. అతఁడు గోల్కొండసుల్తానుగారి ప్రతినిధి. అతని సంపూర్ణనామము నబాబు సయ్యదు హాసన్ మహమ్మదు మీర్ జుమ్లా.

CC-0. Jangamwadi Math Collection, Varanasi

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



ఖాన్‌ఖానుఁడు విజాపురమువారి ప్రతినిధి. ఖాన్‌ఖాన నునది యాతని బిరుదు. ఖాన్ మహమ్మ దాతని నామధేయము. ఇరువురును బ్రచండ సేనానులు. కర్ణాటకమును యావత్తును దన స్వాధీనమునందుంచుకొన వలయునను నాశ యిరువురకును గలదు. గోల్కొండ విజాపురసుల్తాను లొండొరులతోఁ గావించుకొన్న యొడంబడికప్రకారము గండికోట దుర్గ మునకుఁబశ్చిమముననున్న రాజ్యము విజాపురమునకుఁ జేరవలసియున్నను, ఆసంధి షరతులను సరకుఁగొనక మీర్‌జుమ్లా గుత్తిదుర్గము నాక్రమించు కొనెను. ఖాన్‌ఖానుఁడా జోరావరిని సహింపక గండికోటపై నెత్తి పోయి ముట్టడివేసెను. అంతేకాదు గోలకొండపాదుశాహగారికి దక్షిణ దేశమందుఁ జెల్లుచుండిన దేశమును దుర్గములను నాక్రమింపవలసినదని చెంజిదుర్గాధ్యక్షుఁడగు నంబారుఖానునకు ఉత్తరువంపెను. అంబారు ఖానుఁడు ఖాన్‌ఖానునాజ్ఞ మేరకుఁ దనక్రింది సర్దారులను గూర్చుకొని గోలకొండవారి దుర్గములపై నెత్తిచని మటముకోట మొదలగువానిని స్వాధీనపఱచుకొనెను.

గోలకొండ రాజ్యమప్పుడు చెంజిదుర్గప్రాంతమువఱకు వ్యాపించియుండెను. ఇచ్చట ననేకులు హిందూనాయకులును పాళెగాండ్రును సుల్తానునకు లొంగి కప్పముకట్టుచుఁ బెక్కుసీమలను దుర్గములను నేలుచుండిరి. వెంకటగిరి ముఖాసాదారులగు వెలుగోటివారును కాళహస్తి జాగీరుదారులగు దామెరలవారును చెంజి పరిసరప్రదేశములపైఁ బ్రభుత్వము నల్పుచుండిరి. మధురాంతకము, కరుగుడిపాళెములు వెలుగోటి యాచమనాయునికిని కంచి, పూనమల్లి, దేసూరు, మటము మొదలయిన కోటలు దామెరల వెంకటప్పనాయునికిని జెందియుండెను. అతని యనుచరుఁడగు పేట కృష్ణారెడ్డి దేసూరి కోట నేలుచుండెను.

ఖాన్ ఖానుని యాజ్ఞ మేరకు నంబారుఖానుఁడును నతని సర్దారులును మొదట మటముకోట నాక్రమించిరి. ఇది చెంజిదుర్గసమీపమున

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



నిప్పటి యుత్తరఆర్కాటుజిల్లాలోనికి సణఁకువమైన వందవాసితాలూకా యందున్నది. తత్సమీపమునసున్న కొన్ని కోటలను వశపఱచుకొని చెంగల్పట్టజిల్లాయం దంతర్గతమైన కరుగుఁడిపాళెము, కంచి మొదలగు స్థలములను గొనుటకై తూర్పుముఖముగ నడచిరి. మార్గమున నయ్యావారిపురమును గాల్చిరి. ఇది యిప్పటి కాంచీపురము తాలూకాలోని యయ్యంపేఁట యగునేమో? అచ్చటి ప్రజలు తాళజాలక దేశత్యాగము చేసిరి. కడపట కంచిపైఁ బడిరి. ఇంతవఱకును వారి కపజయము లేదు. కాని యకస్మాత్తుగ వెనుకనుండి వారికిఁ బిడుగువంటిదెబ్బతగిలెను. అంతట వా రచటినుండి మరలవలసివచ్చెను.

చెంజిప్రాంతమున పైఁ బేర్కొనఁబడిన మటముకోట కనతిదూరమున దేసూరుదుర్గము గలదు. ఇది బహుబలిష్ఠమైనది. దీనికి 'చెంజిహృదయభీకర' మను బిరుదు గలదు. దేసూరిప్రభువగు పేఁట కృష్ణారెడ్డి, దామెరల వెంకటప్పనాయని కాప్తానుచరుఁడు. తనదేశముపైఁబడి యాబారుఖానునిదండు నాశనము సేయుటఁగని కోపించి వెంకటప్పనాయని సోదరుఁ డగు సంకప్పనాయకుఁడు (ఇతఁడే ఉషాపరిణయకావ్యకర్త) కృష్ణారెడ్డిని బురికొల్పి బిజాపురివారి భూములను గోటలను బాడుసేయుమని యాజ్ఞనిచ్చెను. అతఁడు మొదట మటముకోటను గొని యచటికాఁపున్న బిజాపురపుసర్దారుఁడగు దుర్గోజిని సంహరించి యటువెనుక మధురాంతకముపై నడచెను. కడపట చెంజిని ముట్టడించి పేఁటలను గాల్చి కోటలగ్గలకెక్కి చూఱఁగొనెను.

ఈ సీసమాలికయందు వర్ణింపఁబడిన విషయము మఱియేగ్రంథమునందును గానరాదు. కృష్ణారెడ్డిని సంబోధించు నీసీసమాలిక యాతనికాలముననె రచియింపఁబడెననుట నిశ్చయము. కావున నిది సమకాలికగ్రంథము. చరిత్రరచయితలకు నిది యత్యంతోపయుక్తమగుచున్నది.

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



## సీసమాలిక.

సీ. శ్రీవిష్ణుదేవుని శ్రీపాదమునఁబుట్టి
గంగకు సైదోడసంగఁ బ్రబలు
పంట వంశాగ్రగణి పరమపావనుఁడైన
వేఁటయల్లన్నకుఁ బ్రియతనూజు
లయ్యన్న నీవును నలఘుఁడౌ పేరప
నాగన గంగభూనాయకుండు
రంగభూపాలుండు రణవీరగాండివి
సౌందర్యవంతులు సరసనిధులు
కలిగితి రయ్యారె! ఘనబలాఢ్యులు మీరు
వసుధ నార్గురు చక్రవర్తు లనఁగ
మిముఁ బెంచె హర్షాన మీమేనమామ దే
వారెడ్డి చెన్నభూవరుఁడు వాసి
వన్నెగా మిము రాయ మన్నీలు దొరలును
రాజులు గొనియాడ తేజముగను
నీసోదరులలోన నెఱయోధ నాగన్న
రణవిక్రమార్క వీరప్రతాప
శాలి నిశ్చలవృత్తి శాత్రవబలములు
దలఁక పైకొని రాతుతండములను *
గవయు తద్వైరి సంఘము నందఱిని దన
కరఖడ్గధారచే నఱికి నఱికి ౧౦
చెంజిపురిబయళ్ల సింహాలంఘనవృత్తి
దేవతల్ దెచ్చిన దివ్యరథము
రహి నెక్కి చేరె వీరస్వర్గ మచ్చోట
తదనంతరంబున హదులు మెఱసి
తక్కనరిపుల నీతమ్ముఁడు గంగన్న
నిలిచి ఖడ్గాఖడ్గి నీటణంగ

* బలములు లయశత్రు రాతుతండములను 15-4-8 P 113/19.

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



ద్రుంచెను రణఘాత లంచితంబుగఁ దన
మేనికి భూషణ మిశ్ర మమర
నీకొంతయును ముద్దు నీటుగాఁ జూపుచు
పౌరుషఖ్యాతిచే వఱఁఢఁగిల్లు
గంగన్న రంగప్ప కదనహంవీరులు
భక్తితో నినుఁగొల్వఁ బ్రౌఢిమెఱసి *
శ్రీమంతుఁడై నట్టి హేమాద్రిదాన చిం
తామణి భోగసుత్రాముఁ డబ్ధి
గాంభీర్యగుణశాలి కనకకర్పూరవ
సంతరాయఁడు సత్యసంధుఁ డుచితుఁ
డంగనాజనమోహనాకారరూపపాం
చాలుఁడు రాజవేశ్యాభుజంగు
జగనొబ్బ గండనిశ్చలవీరనారాయ
ణాంకసద్బిరుదాంకుఁ డమితకీర్తి ౨౦
రేఖాప్రతాపధురీణుండు పంటవం
శాగ్రణి నిశ్శంకుఁ డర్జునాంశఁ
జెలువుగా విలసిల్లెఁ జెంజిదుర్గానకు
హృదయభీకర మహాబిరుదమైన
దేసూరికోటలో వాసివన్నె ఘటిల్ల
బంధువుల్ దొరలును బరిజనంబు
తోనుండె నన మహాఃవీంద్రులు మెచ్చి
రయ్యారె! సకల దిగంతరముల
అంతలో ఖాఁ ఖానుఁ డాగ్రహించి నబాబు
మీఁద దండెత్తి హమికను గండి
కోట ముట్టడి వేసికొని రోషచిత్తుఁడై
యక్కడి ఘడికోట లాక్రమించు

* నెంతనీటు మెరయ ప్రౌఢిమెరసి,

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



మని కాగితం బంప నంబారుఖానుండు
　　అది చదువుక [తాను] హనులు మెఱసి
బల్లిదుండగు మురార్జల్లిని బాలోజి
　　యహిపతిరాయ శూరాగ్రగణ్యు
బాజఖానుని [బల] వంతు మహమ్మద
　　రఖాను మత్తు కైరాతఖానుఁ *
బేరు పేరులఁ బిల్చి.........
　　గడిసీమ లన్నియుఁ గట్టు డనుచు　　30
సెలవుపెట్టినవారు బలువిడి నేతెంచి
　　యతివేగ మటముకో టాక్రమించి
క్రూరుఁడైనట్టి దుర్గోజి పండితులను
　　నిర్భయు నచట ఠాణెంబు వెట్టి
అలకోట తెల్నాటికో? టాదిగాఁగల
　　కోటలన్నియుఁ గట్టకొని.........
ముట్టడిసేయను మొనగాండ్లఁ గైచేసి
　　దాదారరానను థాణె ముంచి
కంచి చెంగల్పట్టు కరుగుడిపాలె
　　............మాక్రమింపఁదలఁచి
అలమురార్జల్లియు నత్యుగ్రుఁ† బాలోజి
　　యహిపతిరాయఁడు నయ్యవారి
పురము పేటలు గాల్చి పొలుపుగాఁ గంచిపై
　　జగడమిచ్చిరి ప్రజల్ పగిలిపాఱ
అంతట కంచి రే నెంతయు ముట్టడి
　　దా కినచో నీవు డాక మెఱసి
నిను సంతరించిన నృపమణి దామెర
　　వెంకటేంద్రుని రాజ్యవిభవమెల్ల

*బాజఖానుని వంతుడైన మహమ్మదరఖాను దుర్మత్తుడైన కైరాతఖాను. †ఉగ్రోగ్రు.



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



నుద్ధరింపఁదలంచి యుద్ధసన్నాహమై
దామెర యంకభూధవునియాన[1] ౪౦

పినతండ్రియైనట్టి పెదకృష్ణవిభుని నీ
యల్లు............... 

శూరుఁడైనట్టి దేవారెడ్డి పెద్దన
(ధీరులౌ) దొరల దేసూర నునిచి[2]

మధురాంతకపుగోత్ర మన్నెసింహంబుపైఁ
(గూచి సేయుంచి) గగ్గోలుగాను

అళ్కుబెళ్కును లేక యత్యంతఘోరమై
బహువాద్యఘోషముల్ పరిఢవిల్ల

బట్లు నీబిరుదు లేర్పాటుగాఁ బొగడంగ
కటికవారలు చేరి కలటు (?) సేయ

నెఱయోధులగు రెడ్డిదొరల రాజుల మంచి
కైజీతపొంటరికాండ్ల వీర

భటుల హెచ్చైన తుపాకుల చేరువ[3]
కాండ్లఁ గూర్చుక భయంకరనిరూఢిఁ

గదిసి పురంబుల గాల్చునాఁ డుగ్రుని
ధాకతో మటము కోటకును జేరి

కదిసి లగ్గల కెక్కి కరఖడ్గధారచే
బిరుదు రాహుత్తుల పించ మార్చి

గబ్బిగరీబుల కంఠనాళంబులఁ
గటికటుక్కునఁ దెగ నఱకి నఱకి ౫౦

1. అపుడు దామెర యక్క భూవిభు ననుమతిగైకొని
2. అత్యంతరణశూరుడైన దేవారెడ్డి
పెద్దనదొరల దేసూరనునిచి
3. భటుల హెచ్చైనట్టిగురి తుపాకులచెరువ

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



నిండుసిలేదార్ల బొండుగ ల్దెగటార్చి
నీపైన రిపువతాణీలఁ గొట్టి[1]
కపటగరీబులగర్వంబు లణఁగించి
వీఁక మరాటీల పేరణంచి
యబిసికనీజుల[2] యంగము ల్దెగటార్చి
దళకర్త దుర్గోజిగళము ద్రుంచి
నెత్తురు మాంసంబు మెత్తని క్రొవ్వును
రణభూతభేతాళరాజి కపుడు
విందు గావించ చహో! వీరలక్ష్మి నిజెంది
దయవచ్చి ధర్మదారయును వేగఁ
బట్టించి యంతటఁ బటువిజృంభణశీవిఁ
దనరుచుఁ గీర్తి ప్రతాప మెలయ[3]
నతని డాలుడమాము లతని తేజీలను
నతని వస్తువ్రాత మంత (వట్టుఁ)
గైకొని చెంజిలోఁగల పేట లన్నియు
లక్ష్మీపురము మొదలయిన వన్ని
గాల్పించి చెంజి లగ్గల కెక్కవలెనని
పొడవైన నిచ్చెనల్ పొంకపఱచి
బలుఫిరంగీబండ్లు బాణాలమోపులు
మందుతిత్తులు చాల నందగించి    ౬౦
అల చెంజిలోపలఁగల మల్కిమొల్కల
రకమైన ప్రజల హేరాళముగను
ముక్కులు గోయింప నుక్కుచిప్పలు చాల
చేయించి నీపరిసేవకులను
విడిచి చెంజీపురి వీథివీథుల... ...
రాతివాకిట[4] మేల్గురాల హెచ్చు
విడిపించె నాతతహృద్వీథి... ...
దీనుఁడై యాబాయఖానుఁ డుండె

1. రాతులనుగొట్టి  2. కణోజేల.  3. ప్రతాపంబువెలయ.  4. వాకిట.

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



అంతట బాలోజియహిపతిరాయఁడు
యలమురార్జలి మొదలయిన దొడ్డ
సరదారులందఱు... ... ... ...
... ... ... ... ... ... ... ... ...
అదె వచ్చె పేట కృష్ణార్జునం డంచును
వెఱచువారును పూరిఁ గఱచువారు
నై విరిగి (గ్గి ?) పోయిరి యలసరదారులు
నీయుద్ధ మిలను వర్ణింపఁ దరమె
యీవార్త విని నిను నేలు దామెర వెంక
టోర్వీవరుఁడు ... ...
... ... ... ... ... ... ... ... ...
... ... ... నీకను జన్మఁడెన ౨౦
... ... ... ... ... ... ... ... ...
... ... రంగప్పఁదోడ్కొని రాజసమున
(పొడగని పించినీపడసిన గెల్పునా
యనివాడ దెల్పఁగా విని నబాబు
శాబసహో ! (నీదు) శౌర్యం బనుచు మెచ్చి
పంపె (ననీకు) వైభవముగాను
జోకతో నిచ్చ మేల్కొకసుతాలీలు
చౌకట్లు చాల్నగ ల్పమ్మదమున) ౨౪
గీ. ... ... ...డారడ్డి మన్నీలలోన
కదనహంవీర పేఁటెల్ల ఘనకుమార
కృష్ణభూపాలచంద్ర ! సత్కీర్తిసాంద్ర !
ధరణి వర్ధిల్లు మాచంద్రతారకముగ. ౨౮

కుండలీకరణము చేయఁబడిన పంక్తులు సంస్కరింపఁబడినవి. అవి మాతృకయందిట్లు గాన్పించుచున్నవి.

"బాబుపొడగనిపించి నీవుగెల్చిన గెల్పులు నాయని వారుదెల్పగావిని నబాబు జోకతోనిచ్చమేల్కొక తెలిమి శాబాసహో శౌర్యంబయ్యారె యనుచు మెచ్చిపంపె వైభవముగాను సుతాలీలు చౌకటులు చాల్నగలు చన్మానముగను "

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



గవలానామితి రేఫలోపే మస్యగత్వే శేషాదేశస్యేతి ఆదేశస్య ద్విత్వే 'అగ్గ' ఇతిస్థితే 'వర్ణలోపాగమాశ్చేతి బహావ స్సంతి తద్భవే" ఇత్యత్వే... ...ప్రాప్తయోః అగ్గువ ఇతిస్థితం. ఇతితద్భవప్రక్రియా సర్వం సమాప్తం.

29. ఆంధ్రకౌముది 16

గణపవరపు వేంకటకవి విరచితము. ఈతఁడు రచియించిన 'లక్షణశిరోమణి' యను నుద్గ్రంథములోని మూఁడవ యుల్లాసమే యీ ఆంధ్రకౌముది. ఈప్రతిలో 'చింతామణి'మున్నగునవిగలవు* వ్రాఁతమంచి ది.తప్పులంతగ లేవు. గ్రంథపాతము లేదు. పత్రములుమంచిస్థితిలోనున్నవి.

ప్రారంభము :—

క. శ్రీభామానర్మోక్తి క
   ళాభవ నిజమందహాస భాగధగశ్రీ
   శోభిత శుభతత్కుచకుం
   భాభోగకలాస వేంకటాచలవాసా.

అవధరింపుము :—

సీసమాలిక :—

సీ. శ్రీకరమ్మగను సంస్కృతమునఁదను ప్రాకృ
      తమునకుఁగల లక్షణములు చెప్పె
   తెచ్చుఁగున నానావిధమ్మైన లక్షణముఁ జేయ,
      రాకున్కియదియు నేరమ్మ గాదు
   తొల్లిటి సుకవుల కెల్లను ననుధన్యుఁ
      గావించు తలఁపింతె కాని యనుచు
   కుకవిజనాజ్ఞాన ఘోరాంధతమసము
      పోఁగొట్టఁగల్గుఁ గౌముదివిధాన...

---

*చూ. ప. పు. భాం. మూఁడవభాగము వ్యాకరణగ్రంథములు. పు 1-8 సంపు



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha


ప్రబంధరాజ వేంకటేశ్వర విలాసమును రచియించిన కవియాతఁడే.

ఈ కౌముది పరిషత్తునందు ముద్రితమయినది. విశేషము లట సరయునది.

## 30. ఆంధ్రకౌముది 31.

పరిషత్పుస్తక భాండాగారము మూఁడవభాగమున 6-8పుటలలో నీప్రతినిగూర్చి విపులముగ వ్రాయఁబడినది. అందలి మూఁడవయుల్లాస మేయిది. కాననటఁ జూచునది.

## 31. ఆంధ్రకౌముది 133.

సంస్కృతముతోడను, తెలుఁగుతోడను గూడినది. 17 పత్రములుగలది. వ్రాఁత బాగుగ లేదు. తప్పులంతగ లేవు. వ్రాయసగానిపేరుగాని, కవిపేరుగాని తెలియరాదు. సూత్రములు వృత్తి సంస్కృతభాషను, ఉదాహరణములు తెలుఁగునను వ్రాయఁబడినవి. పత్రములు శిథిలములు-క్రిమిదష్టములును.

గ్రంథారంభము:—

శ్లో. శ్రీమచ్ఛంకర మానమ్య నారాయణమునిం గురుం
కుర్మశ్శృత్స? తా మాంధ్రకౌముదీం జ్ఞానసిద్ధయే
ఆదావర్ణవివేకః. అః ప్రీతింతనుతే నిషేదురయా......నబ్రూతే
యభ-మాకారః. ఆకారోహర్షం. క్రోవిద-క్రోధాదివాచకోన
చేత్. ఇకారాది చతుష్కం తుష్టిమనోరథమూలం భవేత్.

ఇందు-వర్ణశుభాశుభవిచారము గణశుభాశుభఫలవివేకము. రేఫ రకారనిర్ణయము, యతిప్రాస ప్రకరణములును గలవు.

తుదిభాగము.

అథద్విప్రాసః:—

స్థానే ద్వివర్ణా చరణ చరణయోః
నియమేషు యథాపూర్వా ద్వా వర్ణా స్థాచేత్ స......

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



అథబిందుప్రాసః:—

నియమవర్ణపూర్ణబిందుః స్యాత్. పద్యస్య యథాపూర్వక్రమేణ నియమస్థితో వర్ణః పూర్ణబిందుశ్చేత్తో సోఽపి బింధుప్రాసః. ఇతిప్రాసప్రకరణం సంపూర్ణం.

తుదిని రెండుపత్రములలో గొన్ని స్తోత్రశ్లోకములు గలవు.

32. ఆంధ్రశబ్దచింతామణి - సంస్కృతవ్యాఖ్యానము.

ఇందు 46 పత్రములు గలవు. వ్రాత బాగుగనే యున్నది. తప్పులంతగ లేవు. పత్రము లటనట క్రిమిదష్టము లయినను మంచి స్థితిలో నున్నవి. వ్రాయసగానిపేరు తెలియరాదు. తొలుత 5 పత్రములు చింతామణి కారికలును, ఆవెనుక 34 పత్రములు చింతామణి కారికలకు సంస్కృతవ్యాఖ్యానమును, పిమ్మట 8 పత్రములు వివిధవిషయములును గలవు. టీక రచియించినవారెవరో సరిగా దెలియవచ్చుట లేదు. తుదినిమాత్రము "బాలసరస్వతీయ టీకాసహితాంధ్రశబ్దచింతామణి స్సమాప్తః" అని కలదు. ఇంతమాత్రమున నిది బాలసరస్వతి రచియించిన టీకయనుటకు వలనుపడకున్నది. ఏలయన ప్రారంభమున అప్పకవినిగూడ నీతఁడు స్తుతించినాఁడు. కావున దరువాతివా రెవరో యీటీకను రచించి బాలసరస్వతి రచియించినట్లు దెలుపుటకై తుదినిట్లు వ్రాసినారేమో? కాని యుదాహరణములు, విషయమును ముద్రిత బాలసరస్వతీయమునకు జాలవఱకు సరిపడియున్నవి. విమర్శకు లిందలి యథార్థమును నిర్ణయించెదరుగాక.

ప్రారంభము:—

నమస్కృత్యాప్పకాఖ్యార్య మథర్వణవిపశ్చితమ్
తథైవాప్పకవిం చాంధ్రసూత్రవ్యాఖ్యా విరచ్యతే.

విశ్వేతి-కవయతీతి కవిః తస్యకర్మ కావ్యం. పంకజాదివత్ యోగరూఢత్వాద్రస సోల్లసిత-శబ్దార్థాత్మకమేవ న కర్మమాత్రమ్. తత్కావ్యం విశ్వశ్రేయః ప్రపంచశ్రేయస్కరం భవతి. సారోపలక్షణయా అవ్యభి

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha


చారేణ కార్యనిష్పాదకత్వం ధ్వనితమ్. ఏతేన సకలజనానాం ధర్మాద్యఖిలపురుషార్థప్రదమితి తాత్పర్యమ్.

తుదిభాగము:—

అత్వాదీతి:—తత్సమానామివ తత్సమక్రియాణామివ దేశ్యానాం క్రియాపదానాంచ అత్వాదికార్యం స్యాత్. వ్యతిరేకాదా భావినీత్యాది సూత్రేణ విహితాకారాదికార్యాణి తత్సమక్రియాణామివ దేశ్యక్రియాణామపి భవన్తీత్యర్థః. ఉదాహరణం తత్ర తత్రోక్తమ్. పురుషేషు, వర్తమానార్థప్రభృత్యర్థేషుచ, ఏకవచనప్రభృతివచనేషుచ వర్ణాగమో విశేషతయా భవతీత్యన్వయః. యథా:—ఉన్నాఁడు, రాఁడు, రావించె, కాఁచె, కావఁడు, పోమె, పోతివి, పంపె, చనిమె, చనితివి, వినిమె, వింటె, అయితిని, కాఁడు, కమ్మ, కావించె, చూచున్, చూడఁడు, ఇత్యాదయః.

పిమ్మట గోమూత్రికాబంధము మున్నగునవి చిత్రములతోపాటు చిత్రింపఁబడినవి.

## 33. ఆంధ్రశబ్దచింతామణి-తెలుఁగుటీక.

ఇది 28 పుటలుగల కొండపల్లి పీచుకాగితపుప్రతి. శ్రీమహారాజావారు పరిషత్తునకొసఁగినది. వ్రాఁతతీరు బాగుగనేయున్నది. తప్పులంతగ లేవు. టీకవ్రాసినవారెవరో తెలియదు. వ్రాయసగానిపేరు తెలియరాదు. పత్రముల తుదలు తునిఁగిపోయినవి. తొలుత నాలుగుపుటలు లేవు. 'యరలవసహాళం తు హల్వర్గః' అనుసూత్రము టీకతో నారంభమయినది. అదిమొదలు అజంతపరిచ్ఛేదమునందలి 'టాదిష్ భక్త్వాద్యేకే' అనుసూత్రము టీక తుదివఱకు నింతవ్రాయఁబడినది.

ఆరంభము:—

హల్వర్గః-హల్=హల్లుల యొక్క, వర్గః=సముదాయము. అనఁగా దేశ్యతద్భవాత్మకమయిన యీ యాంధ్రభాషయందుఁగల ముప్పదియాఱువర్ణంబులలో హ్రస్వదీర్ఘభేదమువలన రెండువిధములయిన-అ,

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



ఇ, ఉ, ఎ, ఒ, లును, ఐకారౌకారములును, పూర్ణఖండబిందువులును, ఈపదునాలుగచ్చులు దంత్యతాలవ్యభేదమువలన రెండు విధములయిన చకారజకారములును, కగటడణ తదన పబమ యరలవ సహాళములును నీయిరువదిరెండు హల్లులని తాత్పర్యము.

తుదిభాగము:—

టాదిః విభక్తౌ నిర్నేత్యేకే-టాదిః విభక్తౌ=తృతీయైకవచనము, ఆది= మొదలుగాఁగల విభక్తౌ=విభక్తి పరమగుచుండఁగా నిః=న్యాగమము, నేతి=లేదని, ఏకే=కొందఱు. అనఁగా-టాదివిభక్తిపరంబగునపుడు న్యాగమంబు లేదని కొందఱందురని తాత్పర్యము. రాముచేతన్-రాముకొఱకున్ ఇత్యాదులు.

## 34. హరికారికావళి 4678.

శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారిచే రచింపఁబడినది. ఇందు 54 పత్రములు గలవు. క్రమముగ-10 పత్రములు హరికారికావళి, 34 పత్రములు ఆంధ్రశబ్దచింతామణివృత్తిజ్యోత్స్న-10 పత్రములు హరిమీడే స్తవమును గలవు.

కారికావళిప్రారంభము.—

పరిభాషాప్రకరణము.

శ్లో. సిద్ధి స్స్యాత్ప్రాకృత శబ్దానాం భవేత్పంచాశదక్షరైః

ద్విధాక ఏదోఽనుస్వారో విసర్గ ష్షోడశ స్వరాః. ౧

స్పర్శా అంతస్థ్లోష్మాణ శ్చతుస్త్రింశ ద్ధల స్స్మృతాః

ప్రాకృతానాంచ సిద్ధిస్స్యాత్ తే చత్వారింశదక్షరైః. ౨

ఈరీతి కారికలు 226 గలవు.

ఇందలి పరిచ్ఛేదములు.—

1. పరిభాషా 2. సంజ్ఞా 3. సంధి 4. అజంత 5. హలన్త 6. ఆచ్ఛిక 7. కారక 8 సమాస 9. తద్ధిత 10 క్రియా 11. కృదంత 12. ప్రకీర్ణపరిచ్ఛేదములను నివి.

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



తుదిభాగము.—

శ్లో. యవలా లఘవోఽలఘవ స్సున్నహ్యాంతి నకా తథా లరో రేఫః
అన్యే విశేషవిషయా శ్చార్యవ్యవహారసరణితో జ్ఞేయాః.

ఇతి ప్రకీర్ణ పరిచ్ఛేదః.

ఆంధ్రశబ్దచింతామణి వృత్తిజ్యోత్స్న.

కృష్ణమూర్తిశాస్త్రిగారు కారికావళిని దాము రచించినట్లు దెలుపలేను గాని యీ చింతామణి వృత్తిజ్యోత్స్నను దాము రచియించినట్లు దెలుపుచు గ్రంథారంభమున శ్లోకముల రచియించినారు కారికలు మాత్రము వెనుకఁదెలిపినవియే. టీక సంస్కృతభాషను, ఉదాహరణములు తెలుఁగుభాషను గూర్పఁబడినవి.

ఆరంభము:—

౧ శ్రీసతీస్తన శైలాగ్రవాస ప్రత్యగ్రవాదం
కంచన ద్విజరాజాఙ్కం కమలాశ్రిత మాశ్రయే

౨. శ్రీమత్కదంబవర్యస్థిరలసదైశ్వర్యయుక్తి రజయత్,
ఆనగాలగోత్రధర్మా స్ఫుటిత శ్రీకాళహస్తి ధరణీశః.

3. శ్రీమద్వరదామరకుల కులధామాదరరామ సూక్తిశ స్సోఽహం
సుమతి ర్వృత్తి ర్నాన్నసూత్రాణాం కృష్ణమూర్తి రాహకుర్వే.

౪. అతులా మత్కృతి స్నేయ మభ్రాంతవినుతాకృతిః
దిగంతవ్యాపినీ జ్యోత్స్నా ధినోతు రసికావళిం.

౫. మాత్సర్యమలిన వృత్తీ నతాన్సర్య మదీయకృతి రియం వృత్తిజ్యోత్స్నా. లోకానివ సవివేకాన్ లోకా నిహ రంజయతి చకోరాన్వా.

౬. జయతిసకలవిద్యాజన్మభూమి ర్జగత్యాం
జనితసరసచేత స్సంప్రతో పాద్యభాషా
తదనుసరణ లీలాదత్త వీక్షామనీషా
తరళయతిచ శీర్షం తావదే వాంధ్రభాషా.

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



౭. శ్రీరామాయణభారతాది వచనోదారార్థ వల్మీకభూ
పారాశర్యముఖాన్ప్రణమ్య కవితాధారా నిదానీంతనాన్
ధీరానన్తరమిత్రపాత్రపదవీదూరా నతీవాదరా
దారాధ్య ప్రకృతార్థసార్థఘటనాచారాయ సమ్యగ్యతే.

౮. యే కేచన ప్రకృతిమత్సరిణో మదీయ
గ్రంథం సందర్భమపి సంప్రతి దూషయన్తి
బుధ్వాపి సాధ్వితరమితి స్థితిమత్యజన్త
స్తే౽పీహ భూతకవితుల్యతయా ప్రణమ్యాః.

తుదిభాగము:—

శ్లో. సర్వత్ర సద్రుతః క్త్వార్థే వ్యతిరేకేతు వాభవేత్
ఉత్తరస్య కొనే ర్ధాతోః క్కంబుధాః కేచిదూచిరే.

వృ. ఇక్కర్జమొఱరించి యేగుము. రొక్కమిచ్చి వెడలుము. ఓర్వ కనుండె. ఓర్వకుండె ఊఱడక నడవిలో వేటాడె. గబ్బిమరుఁ డానఁబెట్టక గొబ్బునపైఁబడును. తమ్ములఁదీసుక వచ్చితి. పక్షే-ఆనఁబెట్టుకొని, తమ్ము లఁదీసికొని ఇత్యాది.

శ్లో. యవలా లఘవో౽లఘవ స్స్నిహ్యంతి న లా తథాలరో రేఫః
అన్యే విశేషవిషయా శ్చార్యవ్యవహార సరణితో జ్ఞేయాః.

ఇతిప్రకీర్ణ పరిచ్ఛేదః.

శ్లో. శిష్టాన్వవాయజలనిధిజనితశ్రీకృష్ణమూర్తి కృతిచంద్రః
వ్యతనోద్విద్వచ్చేతఃకువలయసంమోద దాయినీం జ్యోత్స్నాం.

శ్రీలలితార్పితాభవతు.

శ్రీకృష్ణమూర్తి రచితా వృత్తి రియం నన్ననార్య సూత్రాణాం
జ్యోత్స్నా సతతం వసతా దాచంద్రార్కం కవీంద్రరసనాసు

"నలనామసంవత్సర వైశాఖ శు ౩ శుక్రవారం మర్ల సూరయ్యా"
అని తుదినిగలదు.

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



35. హరికారికావళి-ఆంధ్రశబ్దచింతామణి వృత్తిజ్యోత్స్న 49.

పై మాతృక కిది పుత్త్రిక. 41 పుటలుగల కాగితపుప్రతి. క్రొత్తపల్లి సూర్యరావుగారిచే వ్రాయఁబడినది. వ్రాఁత చక్కనిది.

36. కావ్యాలంకారచూడామణి. 75.

విన్నకోట పెద్దనకవి విరచితము. ఇది 76 పత్త్రములుగలది. వ్రాఁతమంచిదిగాదు. తప్పులుమెండు. లిపి కన్నడమోడీనున్నది. వ్రాయసగాని పేరు గానరాదు. తొలిపత్త్రము లేదు.

గ్రంథారంభము:—

అభ్యుదయపరంపరల కకంపితస్థితి నావహిల్లునట్లుగా మద్విచార చనీయంబగు కావ్యాలంకారచూడామణియను నలంకార లక్షణంబునకు ప్రథమావతరణం బెట్టిదనిన.

ఇది మొదలుగఁ దొమ్మిదవయాశ్వాసము తుదివఱకు నిందు వ్రాయఁబడినది.

తుదిభాగము—తరళ.

బిరుదమిత్త్రుఁడు భిన్నశత్త్రుఁడు పేంద్రపుత్త్రుఁడు యామినీ
శ్వరకులేశుఁడు మా...వేశుఁడు వాహినీ... ... ...
... ... ... ... ... కాముఁడు పూర్ణసోముఁడు కీర్తులన్.
పరఁగుచుండెడ నాసుధాకర భానుతారకవిశ్రుతిన్.

ఇతి శ్రీమదుమారమణ చరణారవిందవందన గోవిందామాత్యనందన వివిధ... ...యనామధేయప్రణీతంబైన కావ్యాలంకారచూడామణి యనునలంకారశాస్త్రంబునందు నంధ్రభాషావిశేషసంధి సమాసాది నిరూపణలక్షణస... ...ల్లాసము.

37. కావ్యాలంకార చూడామణి 871.

విన్నకోట పెద్దనకవి ప్రణీతము. ఇం దుల్లాసములు తొమ్మిదియును సమగ్రముగ వ్రాయఁబడినవి. వ్రాఁతచక్కనిది. తప్పులంతగ లేవు. 90 పత్త్రములు. అటనటఁ గ్రిమిదష్టములు. "సర్వజిన్నామసంవత్సరపుష్య

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Koṣha



శు॥ ౭ జయవారం వరకు పూసపాటి రామభద్రరాజుగారి మాతృక క్రమంగా ముష్టి వెంకన్న కావ్యాలంకారచూడామణి కృష్ణార్పణంగా వ్రాసెను" అని తుదినిగలదు.

గ్రంథారంభము:—

శ్లో. శ్రీభాగాస్పదయోః పరస్పరయుజోః శ్రుత్యుత్సవశ్లాఘయోః
రాగాలాపనిరూఢయో ర్యతిగణవ్యాపారపారీణయోః
సారస్యం గిరిజేశయోరివ సదా సంగీతసాహిత్యయో
ర్ద్వంద్వద్విశ్రమహేతుకం విహరతాం చాళుక్యవిశ్వప్రభో.

తుదిభాగము:—తరళ

బిరుదమిత్రుఁడు భిన్నశత్రుఁడు మహేంద్రపుత్రుఁడు యామినీ
శ్వరకులేశుఁడు మానవేశుఁడు వాహినీశుఁడు విక్రమ
స్ఫురణరాముఁడు నూత్నకాముఁడు పూర్ణసోముఁడు కీర్తులన్
బరఁగుచుండెడ నాసుధాకరభానుతారకవిశ్రుతిన్.

ఇది శ్రీమదుమామనోరమణ చరణారవిందవందన గోవిందామాత్య నందన వివిధబుధవిధేయ విన్నకోట పెద్దయ నామధేయవిరచితంబైన కావ్యాలంకారచూడామణి యను నలంకారశాస్త్రంబునందు, (నకం)ధ్ర భాషావిశేష సంధిసమాస దేశీయప్రయోగక్రియాది నిరూపణ లక్షణ సముద్దేశంబులంగల నవమోల్లాసము.

మిగిలినప్రతులందుఁ గానరాని పద్యములొకకొన్ని యీప్రతి యందుఁగలవు. పరిషత్తునందు వెలువడిన కావ్యాలంకార చూడామణిలో వానిని జూడనగును.

## 38. కావ్యాలంకారచూడామణి 3826.

ఇది 86 పత్రములుగలది. ఈప్రతియందే అహోబలపండితీయ మును గలదు. ఇందలి తొలిపత్రమును తుదిపత్రమును లుప్తములయి నవి. మిగిలిన తొమ్మిది యాశ్వాసముల విషయమును సమగ్రముగ వ్రాయఁబడినది. వ్రాఁత బాగుగనున్నది. అహోబలపండితీయమును



CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



వ్రాసిన యతఁడే యీకావ్యాలంకారచూడామణి వ్రాసినవాఁడును.*
పత్రము లట్టసటఁ దునిఁగినను విషయముమాత్రము లోపింపలేదు. తప్పు
లంతగ లేవు.

ఆరంభము:—

క. గతిహాసశోష (క?) రోషము
లతులోత్సాహంబు భయసమాఖ్యజుగుప్సా
కృతివిస్మయ శమములుగా
సతతనవస్థాయిభావ సంపద నొందున్.

తుదిభాగము:—

గీ. తెలుఁగు పలుకులు పునరుక్తిఁ బలుకుచోటఁ
గదిసి రెండవపదమున మొదలివ్రాఁతఁ
దసరు గిత్వంబు ప్రాసంబు దప్పకుండ
వర్ణములు దీర్ఘసూత్రప్రవర్తి యగుచు.

ఈమూఁడు ప్రతులలోఁ గానవచ్చిన పాఠభేదములను పరిషత్పత్రిక ౨౮, ౨౯ సంపుటములలో ముద్రించినారము. పాఠకులా పాఠభేదములఁ బరికించి ముద్రితప్రతులందలి వ్యత్యాసములను సవరించుకొని యొదరుగాక.

## 39. కావ్యాలంకారసంగ్రహము 242.

మూర్తికవిప్రణీతము. సమగ్రము. ఇందు 56 పత్రములు గలవు. వ్రాఁత చక్కనిది. తప్పులంతగ లేవు. పత్రములు క్రిమిదష్టములు. గ్రంథపాతములు లేవు. ప్రతి మిక్కిలి శిథిలావస్థలోనున్నది. పాఠములు నిర్దుష్టములు.

---

* చూ-పరిషత్పుస్తక భాండాగారము. మూఁడవభాగము. ఆంధ్రవ్యాకరణగ్రంథములు. పుట 11-పరిషత్పత్రిక సం ౨౯-సం. ౫-౬.

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



ఆరంభము:—

శా. శ్రీలీలావతి దానరోమణిసభాసింహాసనస్థైస్తుభా
వేలాభాప్రతిబింబితాంగి యయినన్ వేరొక్కతెందాల్చినా
డౌ లేయంచు దలంచునోయని యమందానందుఁడై లక్ష్మినే
వేళం గౌఁగిటఁజేర్చు శౌరి నరసోర్వీనాథునిం బ్రోవుతన్.

ఇత్యాదిగా నయిదాశ్వాసములు సమగ్రముగ వ్రాయఁబడినవి.

తుదిభాగము:—

హారహీర సారసారి హారశైలవాసవో
ర్వీరుహాహి హారశేష వేషహాసలాలసా
శ్రీరసోరుహాయశస్సుశీలవైరివీరసం
హారసార శౌర్యసూర్యహార్యవార్య సాహసా.

గద్య.

ఇది శ్రీహనుమత్ప్రసాద లబ్ధకవితాసార సారస్వతాలంకార
నిరంకుశప్రతిభాబంధుర ప్రబంధపఠన రచనా ధురంధర
ప్రబంధాంక వేంకటరాయభూషణ సుపుత్ర తిమ్మరాజ
పౌత్ర...నిరుపమావధాన శారదామూర్తి మూర్తి
ప్రణీతంబైన కావ్యాలంకార సంగ్రహంబను
మహాప్రబంధంబునందు.........సంసృష్టి
సంకర నిర్ణయంబును నన్నది సర్వంబును,
పంచమాశ్వాసము.

—

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



## 40. కావ్యాలంకార సంగ్రహము 257.

ఇది 10 పత్రములు గలది. వ్రాఁత తిన్ననిదిగాదు. తప్పులు మెండు. పత్రములు శిథిలములు. వ్రాయసగాని పేరు గానరాదు. నాయికానాయకుల లక్షణములు నుదాహరణములు నిందు వ్రాయఁబడినవి.

## 41. కావ్యాలంకార సంగ్రహము 2968.

ఇందు 24 పత్రములు గలవు. వ్రాఁత బాగుగనున్నది. తప్పులు మెండు. పత్రములు మొదటను తుదిని తునిఁగిపోయినవి. వ్రాయసగాని పేరు తెలియరాదు. అసమగ్రము.

ఈప్రతిలో తృతీయాశ్వాసము పూర్ణముగను, చతుర్థాశ్వాసమునఁ గొంతభాగమును వ్రాయఁబడినవి.

ఆరంభము:—

క. శ్రీరమణి చరణసేవా
పారాయణ యుభయవంశ పావనలక్ష్మా
ధారచిత భాగధేయ య
పార కృపానరస యోబపార్థివనరసా.

గీ. అవధరింపుము లక్ష్యలక్షణములెల్ల
ననఘ భవదీయ నామధేయాంకితముగ
బహువిభక్తుల నొనరింతుఁ బద్యవితతి
నిచ్చటఁ బ్రబంధతతివిధం బెట్లుటన్న.

తుదిభాగము.—

క. శ్రుతికటువులైన పదములు
కృతిపరుషములనఁగఁ జెలఁగు క్షితిసంధే
... ... ... ... ... ... ...
పతిఁగొల్లు సభీష్టసిద్ధి ఫలముల కనఁగన్.

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



## 42. కావ్యాలంకార సంగ్రహము 502.

ఇందు 155 పత్రములు గలవు. తొలుత 131 పత్రములు అయ్యల రాజు రామభద్రకవి విరచితమయిన రామాభ్యుదయము. సమగ్రము. పిమ్మట 24 పత్రములు కావ్యాలంకార సంగ్రహమునందలి ప్రథమ తృతీయాశ్వాసములు. సమగ్రములు. చతుర్థ మసమగ్రము. వ్రాత బాగుగనున్నది. తప్పులంతగ లేవు. రామాభ్యుదయము తుదిని "శ్రా(క్రో)ధి సం॥ వైశాఖ బ॥ ౧౦ గు॥ (గురువారము) వర్కువారణాశి వేంకటేశు రామాభ్యుదయము వ్రాసుకొనెను." అని కలదు. ఆతఁడే యీసరస భూపాలీయమునుగూడ వ్రాసినయాతఁడు.

ఆరంభము:—'శ్రీలీలావతిదానురోమణి' ఇత్యాదిగనున్నది.

తుదిభాగము:—

సీ. అక్రమంబు విసంధి ప్రక్రమభంగంబు
పునరుక్తియుతము సంపూర్ణతరము
వాక్యసంకీర్ణంబు వ్యాకీర్ణమధిక ప
దంబు వాచ్యవివర్జితంబు రీతి
న్యూనోపమం బధికోపమంబు సమాప్త
మస్థానసమాస మనియతఛందంబు....

## 43. రసాభరణము. 1781.

ఇది అనంతకవిప్రణీతము. తెలుఁగు అలంకారగ్రంథము. నాలుగా శ్వాసములుగలది. సమగ్రము. ఇందు 32 పత్రములు గలవు వ్రాతచక్కనిది. తప్పులంతగ లేవు. వ్రాయసగాని పేరు లేదు. ప్రతి మంచిస్థితిలో నున్నది. నడుమ రెండుపత్రములు త్రుటితములు.

గ్రంథారంభము:—

శ్లో. శృంగార హాస్యకరుణా రౌద్రవీరభయానకాః
బీభత్సాద్భుతశాంతాఖ్యా రసాః పూర్వైరుదాహృతాః

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha


సీ. చారుశృంగార రసస్థాయి రతియగు
హాస్యరసస్థాయి హాసమరయ
కరుణరసస్థాయి పరఁగ శోకంబు రౌ
ద్రస్థాయి క్రోధమై తనరునంక
వీరరసస్థాయి వెలయు నుత్సాహంబు
తలఁప భయానకస్థాయి భయము
ప్రకట జుగుప్స బీభత్సరసస్థాయి
విపులాద్భుతస్థాయి విస్మయంబు
విమలశాంతరసస్థాయి శమమసంగ
నిట్లు నవరసములకు నూహింపఁగలిగి
యంచితస్థాయిభావంబు లతిశయిల్లు
ప్రసవఫలరాసులకుఁ బాదపంబులట్లు.

తుదిభాగము:—

శా. జానొందన్ శకవర్షముల్ ఋతుశరజ్వాలీందులై యొప్ప న
య్యానందాబ్దమునందు మాఘమున కృష్ణైకాదశీ భానుయు
క్తానామామృతవేళ నీకృతి యనంతాఖ్యుండు సమ్యగ్రస
శ్రీనిండ ధ్రువపట్టణాధిపున కిచ్చెన్ భక్తిపూర్వంబుగాన్.

క. తలఁచిన తలఁపు ఫలించును
జెలు లగుదురు శత్రులైన శ్రీలొడఁగూడున్
కలికాల దురితములు తు
ప్పల దూరును ధ్రువపురీశుభాసుర కరుణన్.

గద్య.—ఇది శ్రీవాణీప్రసాదలబ్ధ వాగ్వైభవ తిక్కనామాత్యసంభవ సుకవిజనవిధేయ అనంతనామధేయ ప్రణీతంబైన రసాభరణంబునందు సాధారణనాయక చతుష్టయంబు తెలుఁగును, చతుర్విధ నాయికా విశేషంబును, తత్సఖీభేదంబులును, నాయికా ప్రకరణంబు నన్నది చతుర్థాశ్వాసము.

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



## 43. రసమంజరి 165.

గుడిపాటి కోదండకవి విరచితము. ఇందు 95 పత్రములు గలవు. వ్రాతబాగుగలేదు. నడుమ గొన్నిపత్రములులేవు. వ్రాయసగాని పేరు తెలియరాదు. క్రమముగ 71 పత్రములు పదములు తాళములును, 13 పత్రములు రసమంజరియును, 5 పత్రములు ఆంధ్రఛందస్సును; 6 పత్రములు సంగీతవిషయములు గలవు.

రసమంజరి ప్రారంభము :—

శా. శ్రీరంగేశ భుజాంతరాసితమణీ సింహాసనాధ్యక్షయై
స్మేరోల్లాసకటాక్షవైఖరి జయశ్రీ చింతితాభీష్టముల్
సారప్రౌఢి నొసంగి మద్గృహమునన్ సానందయైయున్న మా
శ్రీరంగేశ్వర ... నాయకి మముం జేపట్టు నెల్లప్పుడున్.

క. శ్రీరంగనాయకీకుచ
సారంగమదార్ద్రపత్ర జయశాసనలే
ఖారుచి భుజాంతరుండగు
శ్రీరంగేశుండు నిష్టసిద్ధు లొసంగుతన్.

వ. ఇట్లిష్టదేవతాప్రార్థనం బొనరించి కృతిపూర్వంబున మదీయ వంశాను చరితం బభివర్ణించెద.

గీ. నందవర వంశజలధి పూర్ణేందుఁడగుచుఁ
దనరుసట్టి వసిష్ఠగోత్రమునఁబుట్టి
బిరుదుగా ఘంటసురధానిపేరుఁ గాంచె
మహిని గుడిపాటి వెంగళమంత్రి ఘనుఁడు

క. ఆవెంగళమంత్రికి హరి
సేవాపరుఁడగుచుఁబుట్టె శిష్టజనుల్ సం
భావింప ... ... ... ... దల ... ... ... ...
ధీవరుఁడై యక్కమంత్రి ధీరులు వొగడన్.

క. ఆయక్కన మంత్రీంద్రున ... ... ... ...
కాయతభుజుఁడైన వెంగళార్యుఁడు గలిగెన్

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



ధీయుక్తిని గుఱుఁడన నుతి
సేయఁగ వేదాంతశాస్త్ర...డగుచున్.

గీ. మహితగుణహారి వెంగళమంత్రి శౌరి
శ్రీసతీమణి కైవడైన సింగమాంబ
సతిముదంబునఁ బరిణయమై వెలింగె
భాసురతరానుకూలదాంపత్యమునను.

క. వాణీ హరిరమణీ శ
ర్వాణీంద్రులకు సాటి వరఘంటాసుర
ధాణీ వెంగళమంత్రికి
రాణియగున్ సింగమాంబ రమ్యగుణాళిన్.

క. ఆవెంగళ బుధవర్యున
కావసుధాసదృశసింగమాంబకుఁ గలిగెన్
శ్రీవనితా మాధవులకు
భావజుక్రియ రంగమంత్రి భావజ్ఞుండై.

సీ. తారతారాధీశ తారహారవటీర
తారకాహీర మందారకుంద
పారద నీరదాపార దైరావత
శారదాంబుద ఘనాసారతుహిన
హరిహరకైరభా హరిరాజ హరిహయ
సురధు నీమాలతీ దరమరాళ
శశికాంతకదంతశతకోటి డిండీర
కరసుధాసాగర చరమకాల
... ... ... ... ... ... ... ... ...
చకచక స్ఫూర్తిమెఱయుచు సాంద్రరుచుల
... ... ... ... ... ... ... ... ...
ఘంటాసురధాణిరంగ కరుణాపాంగా!

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha

# సంస్కృతలోకోక్తిముక్తావళీ.

ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యుఁడు, ఎం. ఏ. కాకినాడ.



## ప్రస్తావము.

శ్రీ విజయనగరమహారాజాంగ్లకళాశాలలో నించుమించుగ నర్ధశతాబ్దము ప్రధానసంస్కృతాధ్యాపకులుగను నాంధ్రపండితులుగను నుండి వందలకొలఁది విద్యార్థుల కాంధ్రగీర్వాణభాషావాఙ్మయములఁ గఱపి ధన్యులై, ప్రకృత మెనుబదివర్షములు దాఁటియు వాసనాబలమున సారస్వతసేవావ్యసనమును దొలఁగించుకొనఁజాలక, యింకను ద్రావిడభాషాగ్రథితమగు వైష్ణవదివ్యప్రబంధామృతము నాంధ్రసువర్ణపాత్రమున నింపిన సుగృహీతనామధేయులగు ఉ. వే శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యపాదులవంటి మహామహులు ప్రాతఃకాలతారకలవలె సారస్వతాకాశమున బహువిరళముగాఁ గానవచ్చెదరు. ఆంధ్రగీర్వాణములయందు విద్వత్కవులై, యాంగ్లద్రావిడభాషలలో జితశ్రములై, సంస్థానాస్థానకవీంద్రులైన వీరిపవిత్రనామము నెఱుఁగనివారాంధ్రవాఙ్మయప్రపంచమున నుండరని చెప్పవచ్చును. వీరు రచించిన 'లౌకికన్యాయవివరణ' మను గ్రంథరాజము నాంధ్రసాహిత్యపరిషత్తువారు 1939 వ సంవత్సరమునఁ బ్రకటించియున్నారు. అందు 232 సంస్కృతలోకోక్తులు, న్యాయములు, ఆభాణకములు వివరింపఁబడినవి. ఇం దింకను జేర్పవలసినవి పరస్సహస్రముగఁ గలవు. ఆచార్యచరణులచరణోపాంతమున గీర్వాణభాషావాఙ్మయముల నధ్యయనము చేసిన శిష్యపరమాణువునగు నేను వారికృతి కనుబంధమును గూర్చి సహృదయలోకమునకు నివేదించుచున్నాను. ఆచార్యులవారికృతిలో నెడనెడ ముద్రణదోషములు గలవు; కొన్ని యాభాణకములకు సంబంధించినశ్లోకముల

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



వా రుదాహరింపలేదు; ఆయాలోకోక్తులకుఁ బ్రసిద్ధగ్రంథములలో లభించు నాకరములఁ గొన్నిటిని వా రుల్లేఖింపలేదు. 'ఉజ్జ్వలమతులైన పండితులసన్నిధి సించుకబోధశాలినై' నే నాంగ్లాంధ్రగీర్వాణగ్రంథములఁ బరిశ్రమముగాఁ బరిశీలించి, పైలోపలేశముల నాతెలివియెఱుకలను బట్టి సవరించి, ఆంగ్లాంధ్రముల ననురూపములగు సూక్తుల నుదాహరించెదను. ఈయనుబంధనిర్మాణమున నేఁ బరిశీలించినకృతులలో నొకటి 'సంస్కృతన్యాయములు'— 2 భాగములు. (లక్ష్మీగ్రంథమండలి, తెనాలి, 1939). వీనికి వ్యాఖ్యానము రచించినపండితులు శ్రీ కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి, శ్రీ ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రి యను వారు. వీ రుదాహరించిన కొన్నివాక్యముల కాకరమే చూపలేదు; కొన్నిచోటుల గ్రంథమును మాత్రము పేర్కొని, యేప్రతియో, యేప్రకరణమున నేపద్యమో (లేక పుటయో) యుల్లేఖింపక- సురేశ్వరవార్తికము, భాగవతము, శాంకరభాష్యము, కుమారసంభవము, విక్రమోర్వశీయము, మహాభాష్యము- ఇట్లు పేర్కొనియున్నారు. ముద్రాశాలలు లేని ప్రాచీనకాలమునఁ దాళీదళసంపుటములతో గ్రంథవ్యాసంగము చేయు దినములలో నీరీతిగాఁ బ్రమాణముల సరిగా నుదాహరింపకపోవుట యించుక క్షంతవ్యము కావచ్చునేమో, కాని ముద్రణాలయములు గల నేఁడు వీ రిట్లు ప్రమాణముల సమగ్రముగాఁజూపకుండుట శోచనీయము. ఒక వాక్యము మహాభాష్యములోని దనియో, మహాభారతములోని దనియో వీరు పేర్కొనినచో నాస్థగల మావంటి పాఠకుల కెంత కాలము వ్యయపఱచి, యెంతప్రయాసపడిన నావాక్య మాయాగ్రంథములలో లభించునో వీరేమైన నాలోచించియుండిరా? ఒకవేళ ప్రమాదవశమున మహాభారతమనుటకు వారు మహాభాష్యమని యుండిరా, పాఠకుఁడు వ్యర్థముగా శ్రమపడుటయేకాని, యాయాకరము లభించుటయే దుస్తరము. ఇట్లు సరిగా ప్రమాణముల నాకరముల నుదాహరింపని గ్రంథకర్తలను జేకబ్ పండితుఁడు (Colonel G. A. Jacob) తన

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



'లౌకికన్యాయాంజలి' (౧ భాగము:- నిర్ణయసాగరముద్రాలయము, బొంబాయి, 1900 సం.) పీఠికలోఁ దీవ్రముగ నిరసించి యున్నాఁడు.† ఈముక్తావళి సూరాభ్యలోకభాగ్యము నంది సహృదయకంఠాభరణముగుఁ గాక !

— ౨33 (1) * పంకప్రక్షాళనన్యాయము —

(లౌకికన్యాయాంజలి. I భా. 24. 48. పుట. సంస్కృతన్యాయములు, 47 పు; సంస్కృత లోకోక్తులు, 659 సంఖ్య.)

'అడుసు (బురద) త్రొక్కనేల, కాలు కడుగనేల ?' అర్థ మనర్థప్రదము. ధర్మకార్యాచరణము కొఱకైనను ధనేచ్ఛ వాంఛనీయము కాదు. ధనసంపర్కమేమాత్రమైనను గీడు నొసఁగుటచే నట్టిధనమును గోరనేల ? ఆపదలపాలు కానేల ? అనుసందర్భమున 'పంచతంత్రము'న (II భా. 165 ప.) నీక్రిందిశ్లోకము గలదు:

'ధర్మార్థం యస్య విత్తేహా తస్యాపి న శుభావహా
ప్రక్షాలనాద్ధి పఙ్కస్య దూరాదస్పర్శనం వరమ్.'—(సుభాషితరత్నభాండాగారము, ౧౭౦ పు. 472 ప. 'వ్యాసముచేః')

---

† 'In Taranatha Tarkavachaspati's *Vacaspatyam* we have a list of 151 *nyayas*. popular and technical; but references to works where they are to be found are few and far between, and this considerably lessens their value. Thirty of these were reproduced in V. S. Apte's dictionary, in 1890 but with the same defect. Again in 1875, Pandit Satyavrata Samasrami published a small pamphlet of 36 popular maxims together with a large number of purely technical ones, and professed to give a reference for each of them.§ But a man who refers you to the *Bhagavata-Purana*, to 'A Comentary on the *Vedanta-Bhashya*' or to 'A Commentary on the *Kavya Prakasa*' and vouchsafes no further information whatever, is a worthless guide; and such mere semblance of guidance deserves nothing but reprobation. One can tolerate ambiguity of this kind in the ancient writings; but in modern times, when printed books of reference abound, such vagueness is inexcusable.'

*ఇట్టి గుఱుతు గల లోకోక్తులు శ్రీ వేంకట రవణాచార్యులవారి 'లౌకికన్యాయవివరణము'న లేవని గ్రహించునది.

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



మల్లినాథసూరి 'ప్రత్యాసన్నే' (౧-4) అను మేఘసందేశపద్య వ్యాఖ్యలో నిట్లు వ్రాసియున్నాఁడు—"దయితా-జీవితాలమ్బనార్థీ సన్ ఖఞ్జాకాలస్య విరహిదుస్సహత్వాత్—'ఉత్పన్నప్రతీకారాదనర్థస్య ఉత్పత్తిప్రతిబన్ధ ఏవ వర' మితి న్యాయేన ప్రాగేవ ప్రియాప్రాణధారణోపాయం చికీర్షుస్సన్నిత్యర్థః"—(8 పు. వేంకటరాయశాస్త్రిగారిప్రతి.)

'ప్రక్షాలనాద్ధి...వరమ్' (చూ. రత్నసముచ్చయము, ౬౦ పు, 1111 సంఖ్య; లోకోక్తిరత్నప్రభ, ౪౧ పు, 920 సం; ఆభాణకమాల, 3౧ పు. 145 సం; సంస్కృతలోకోక్తులు, 730 సం; సంస్కృతలోకోక్తిచంద్రిక, 277 సం.)

బ్రహ్మసూత్రభాష్యము (IV. ౧. 16) పై నానందగిరివ్యాఖ్యలో నీన్యాయము రెండుసారు లిట్లు పేర్కొనఁబడినది:

'అగ్నిహోత్రాదీనా మపి పుణ్యాన్తరవద్వినాశత్వాత్ పఙ్కప్రక్షాలనన్యాయాపాతా దారురుక్షుణాపి తాని న అనుష్ఠేయాని.'

'ధీనాశ్యానామపి కర్మణాం అనుష్ఠానస్య విద్యోత్పత్త్యర్థతయా పఙ్కప్రక్షాలనన్యాయానవకాశాత్ పూర్వం జ్ఞానాదనుష్ఠేయాని అగ్నిహోత్రాదీని ఇతి సిద్ధాన్తప్రతిజ్ఞాం వివృణోతి'. పైసూత్రముపై 'భామతి' 'భాష్యరత్నప్రభ'లను గూడఁ జూడఁదగును.

బ్రహ్మసూత్రభాష్యమున మఱియొకచోటఁ గూడ (III. 2. ౨౨)

శంకర భగవత్పాదులు—'ప్రక్షాళనాద్ధి...వరమ్'

అను శ్లోకపాదమును రెండుసారు లుదాహరించి యుండిరి. ఈ భాగముపై వ్యాఖ్య వ్రాయుచు ఆనందగిరి 'పంకప్రక్షాళనన్యాయము' ను మూఁడుసారులు పేర్కొనియుండెను.

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



పంచతంత్రములోనిదని సామాన్యముగా నెంచఁబడు నీపద్యము మహాభారతమునఁ గూడఁ గానఁబడుచున్నదని 'జేకబ్' పండితుఁడు వ్రాసి యున్నాఁడు (లౌ. న్యా. అం. 1. ౪౫ పు.) మహాభారతము నందలి పాఠ మిట్లున్నది.

'ధర్మార్థం యస్య విత్తేహా వరం తస్య నిరీహతా
ప్రక్షాలనాద్ధి పఙ్కస్య శ్రేయో న స్పర్శనం నృణామ్'
—(ఆరణ్యపర్వ. ౨. 49. బొంబాయిప్రతి)

పంచతంత్రపాఠమునే శంకరాచార్యులు స్వీకరించి యున్నారు.

పైలోకోక్తికి సరియగు నాంగ్లలోకోక్తి—

'Prevention is better than cure.'

వివిధవైద్యవిధానములలో సామాన్యముగా రోగనివారకౌషధములు ప్రయోగింపఁబడుచుండును. 'హోమియోపతి' మొదలగు కొన్ని విధానములలో మాత్రము రోగోత్పత్తినిరోధకములగు మందులు వాడుచుందురు. పైలోకోక్తి కిది లౌకికోదాహరణము.

— ౨౩౪. (2) * వర మద్య కపోతః, శ్వో మయూరాత్. † —

రేపు దొరకునన్న నెమలికంటె నేఁడు చేఁజిక్కిన పావురమైనను మేలే—దీనికనురూపములగు సంస్కృతలోకోక్తులు:

—3. 'వరంతత్కాలోపనతాతిత్తిరీ, న తు దివసాన్తరితామయూరీ'.—
—(విద్ధసాలభంజిక. ౧ అం. 21 పు.)

వేఱొకనాఁడు లభించునన్నయాఁడునెమలికంటె నేఁడు లభించిన తిత్తిరిపక్షి (తీతువుపిట్ట) యే మేలు.

---

† సంస్కృతలోకోక్తులు, 1081 సం; ఆభాణకమాల, 18 పు. ౬౨ సం; సంస్కృతన్యాయములు, 351 పు; లౌ. న్యా. అంజలి, ౧. 82 పు; లో. ర. ప్రభ, 56 పు, ౧౨౫౧ సం.

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



— 4. 'వరం సాంశయికాన్నిష్కా దసాంశయికః కార్షాపణః'. —

—(ఆభాణక. ౧3 పు)

సందేహాస్పదమయిన బంగారునాణెముకంటెఁ గర్షమెత్తు తూనిక గల వెండినాణెమైనను సందేహములేనిదగుచో(మాఱునదగుచో) మేలు.

ఇదియు, 'వరమద్య' యనునదియు వాత్స్యాయనుని 'కామసూత్రము'న (౧౫ పు.) నుల్లేఖింపఁబడి యున్నవి.

— 5. 'వరం జీవన్ గర్దభః, న పునర్మృతో ఘోటకః' —

—(ఆభా. మా. ౧3పు.)

చనిపోయిన గుఱ్ఱముకంటె జీవించినగాడిద యైనను మేలు.

వీనికి సమానములగు నాంధ్రాంగ్లలోకోక్తులు:

'అరువాఱుకాసులకంటె రొక్కము మూఁడుకాసులు మేలు'

'A bird in the hand is worth two in the bush'.
'To-day is better than two tomorrows.'

— ౨3౫ (6) విక్రీతే కరిణి కిమఙ్కుశే వివాదః? † —

గొప్పవిలువగల యేనుఁగునే యమ్మివేసి కొలఁదివెలగల యంకుశము నీయనని పెనఁగులాడుట యేల?

'గుమ్మడికాయ పోవుచుండ నూరకొని, ఆవగింజలు పోవుచుండ నట్టె పట్టి చూచెనఁట.'

'Penny-wise and pound-foolish'.

పైలోకోక్తి సమస్యగా గ్రహించి యెవరిచేతనో యీక్రిందిపద్యములు రచింపఁబడెను.—

అ. 'కాన్తారే ఘనతిమిరే భుజఙ్గమేభ్యో
నో భీతా, న చ గణితా మహాపగాపి,
కిం బాలే! వససి భయం మదఙ్గసఙ్గాత్, విక్రీతే.' (స. ప. మా. 61 పు. ౭౫)

† లౌ. న్యా. వి. 110 సం. 3౭పు; సం. న్యా. 3౫౧పు; స. ప. మా. 61 పు. ౭౫—3౧ శ్లో; రత్నస. 1502సం. ౭౧పు; సం. లో. 1049 సం ౧౬౨పు; లో. ర. ప్రభ. 1288 సం. ౫౭ పు.

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



(జారిణిని గూర్చి విటునివాక్యము — పిల్లా, ఈ యడవిలో గాఢాంధకారమున, పాములు మొదలగు క్రూరజంతువులకును భయపడక, మహానదిని గూడ నవలీలగా దాటిన నీవు నాశరీరసంగమునకేల జడిసెదవు? ఏనుఁగు నిచ్చి యంకుసము కొఱకా పీకులాట!)

ఆ. "సౌమిత్రి ర్వదతి 'విభీషణాయ లఙ్కాం
దేహి త్వం భువనపతే! వినైవ కోశమ్'
ఏకస్మిన్ రఘుపతి రాహ వాక్యమేతద్, విక్రీతే." (స. ప. మా. 61 పు. 30)

(శ్రీరామునితో లక్ష్మణునివాక్యము- 'జగత్పతీ, ధనాగారము మాత్రము తీసికొని, తక్కినలంకారాజ్యమును విభీషణునకీయఁదగును' — అనఁగా రాముఁడు 'ఏనుఁగు నిచ్చివేసి యంకుశముకొఱకుఁ బెనఁగులాట యేల' యనె నఁట.)

ఇ. 'సంపీతేఽధరమధుని, స్తనే గృహీతే
సంజాతే గతవసనే తథోరుయుగ్మే
కిం నీవీగత మబలే! రుణత్సి పాణిం, విక్రీతే.' (స. ప. మా. 61 పు. 3౧)

(ప్రియురాలినిగూర్చి ప్రియునివాక్యము — అధరమధు వాస్వాదింపఁబడ, స్తనగ్రహణము చేయఁబడ, జఘనము విగతవసనము కాఁగా, నిఁక నబలా! నీవిమొద్దకుఁ జేరిన నాకరము నేల యడ్డగించెదవు. ఇదెట్టులున్నదనఁగా నేనుఁగు నిచ్చి యంకుశముకొఱకుఁ దగవులాడిన ట్లున్నది.)

— ౨3౬. (7) * శ్రోత్రియవిటన్యాయము. —

(సంస్కృతన్యాయములు. ౧౪౭ పు.)

ఛాందసవిటుఁడు ప్రియురాలిని మడి గట్టుకొని రమ్మనె నఁట— అని పై గ్రంథమునందలి శాస్త్రిసోదరుల వ్యాఖ్య. కాని యానడుమ శ్రీశిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిప్రాదులు సంస్కృత న్యాయములంగూర్చి ప్రకటించినవ్యాసమున† బై వ్యాఖ్యను గాదని యీక్రిందిపద్యము నుదాహరించిరి:

'వేదాధ్యయనసంపూతే మోచ్ఛిష్టం కురు మే ముఖే
అస్తిచే న్మహతీ ప్రీతి ర్వాచం కర్ణం దశస్వ మే'.

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

Digitized By Siddhanta eGangotri Gyaan Kosha



(అధరపానావసరమున ఛాందసప్రియుఁడు ప్రియురాలితో ననిన వాక్యము — వేదాధ్యయనముచేఁ బవిత్రమగు నావదనము నెంగిలి చేయకుము. అంతకుతూహలముగా నున్నచో నా యెడమచెవిని గొఱుకుము.)

పై శ్లోక మీక్రిందివిధముగా సుభాషిత-మణికంఠహారమున (171 పు. ౪౫౮ ప.) నున్నది—

'సామగాయనపూతం మే నోచ్ఛిష్ట మధరం కురు,
ఉత్కణ్ఠితాసిచే ద్భద్రే! వామం కర్ణం దశస్వ మే'.

('కస్యాపి'-శార్‌ఙ్గధరపద్ధతి. 4062 ప. ౬౨౦ పుట)

('సంభోగరసికురాలగు ప్రియురాలు ప్రియునియధరమున దంతక్షతములఁ జేయ యత్నింపఁగా నాకామినితో ఛాందసుఁడగు ప్రియుఁడు పలుకుచున్నాఁడు') రసాస్వాదనావసరమున శ్రోత్రియుఁడు కుంఠితహృదయుఁడని లోకప్రవాదము. కాళిదాసమహాకవి యిట్టులు నుడివియున్నాఁడు.

'వేదాభ్యాసజడః కథం ను విషయవ్యావృత్తకౌతూహలః
నిర్మాతుం ప్రభవే న్మనోహర మిదం రూపం పురాణో మునిః'.

(విక్రమోర్వశీయము. 1. ౮ ప.)

(వేదాభ్యాసముచే మొక్కపోయినబుద్ధితో విషయసుఖవిముఖమగుహృదయముతోఁగూడిన యాముసలిముని యీమనోహరరూపము నెట్లు నిర్మింపఁగలుగును?)

'బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్'. (మనుచ. 2. ౧౩.)

అని పెద్దనయు నుడివియున్నాఁడు గదా.

వీణాప్రవీణయగు నొకసుందరి

'వీణాభ్యసనవేళాయా మహ మామలక స్తనీ'

---

† 'విభూతి'-పుండ్రము 3, రేఖ 1, ౧౧-౮ పుట. (జూలై 1911)

CC-0. Jangamwadi Math Collection, Varanasi.

